# చిత్రకవిత్వం - సంవాదచిత్రం

## చిత్రకవిత్వం - సంవాదచిత్రం

## సంవాద చిత్రం

...ఏ.వి.రమణరాజు

**సాహితీమిత్రులారా!**

రాచనగరులో సంత జరిగేచోట కస్తూరి కుప్పగా పోసి కూర్చొని ఉన్నాడు వ్యాపారి. అక్కడికి ఒక గొల్లెలకాపరి వచ్చాడు వారి మధ్య జరిగిన సంభాషణ ఈ పద్యంలో కవి ఏవిధంగా వర్ణించాడో చూడండి. ఉత్పలమాల వృత్తంలో సంభాషణ.

గొల్లెలకాపరి - నల్లని దేంది బేరి? వ్యాపారి - మృగనాభిరా వల్లవ
గో.- దీన్ని తింటారా? వ్యా. - ఫుల్లసరోజలోచనలు పూతురు చన్నుల
గో.- బూసినితనే జల్లున చేపునా యెగసితన్నకవూరికె
పాలొసంగునా గుల్లకు యెంతయెత్తనుచు
గొంగడిపర్చిన నవ్విరందఱున్

1735-40 సంవత్సరాల మధ్యకాలంలో మధురపాలకుడైన విజయరంగ చొక్కనాథనాయకునికి అంకితం
ఈయబడిన అహల్యా సంక్రందనము అనే కావ్యంలోనిది ఈ సంవాద చిత్రం.
దీని కూర్చినవారు సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు.

ఈ గ్రంథం ఆంగ్లేయపాకుల కాలంలో నిషేధించబడిన శృంగారకావ్యంగా ముద్రపడిన ప్రత్యేక కావ్యం.
అహల్య సంక్రందన(ఇంద్రుడు) సంభాషణ చంపకమాల వృత్తంలో ఎంత చిత్రంగా తీర్చబడినదో చూడండి.

**ఇంద్రుడు - ఎవరది యింటిలోపల? అహల్య - అ దెవ్వరు?**
**ఇం - శక్రుఁడ, అ- చెల్ల! మీరలా! యివలికి రండు,**
**ఇం- నీదు మగఁడెక్కడ? అ - మూల ఫలార్థ మేఁగె,**
**ఇం- రా నువిదరో తామసం బగునో? అ- ఉండుఁడు, పూజలు గాంచి పొండు,**
**ఇం- సేయవలయు పూజ నీ వెఱుఁగవా?**
**యన - సిగ్గున నేఁగు నవ్వుచున్**

అహల్యా సంక్రందనము (2-116)

అహల్యా సంక్రందనుల సంవాదం ఉత్పలమాలో
(సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని అహల్యా సంక్రందనము 3-85)

అహల్య - దేవ శచీ మనోరమణ దేవర వచ్చిదేమి
ఇంద్రుడు - నీదు శోభా విభవంబుఁ జూడ,
అహల్య - వనవాసిని కేమి చెల్వు
ఇంద్రుడు - రత్న మే తావున నున్న నేమి
అహల్య - వనితా నవ మన్మథ నాపయిన్ గృ పోద్భవన నానతిచ్చెదవు,
ఇంద్రడు - భవజు నాన, నిజంబు పల్కితిన్

కందపద్యంలో (అహల్యా సంక్రందనము 3-86)
అహల్య - నామగని వేష భాషల నేమిటికి ధరించి వచ్చి తెఱుఁగం జెపుమా
ఇంద్రుడు - నీ మగని రూపు మాటకు పై మాటలు నడుపవలదె పంకజగంధీ

ప్రేయసి ప్రియుల మాటలు ఎంత సరసంగా ఉంటాయో చెప్పడానికి ఈ శ్లోకం చూస్తే తెలుస్తుంది. ఇది చాటుధరాచమత్కారసారమనే దానిలోనిది.

**శ్లో. కఠిన కుచౌ తవ బాలే, చటుల చకోరాక్షి తావకే నయనే**
**కుటిల సుకే శ్యలకా స్తే మిథ్యావాదిన్లతాంగి తవ మధ్యమ్**

ప్రేయసి - కఠిన! (ఓ కఠినుడా!)
ప్రియుడు - కుచౌ తవ బాలే
(ఓ బాలికాతిలకమా నీకుచములు కఠినముగాని నేనుగాదు)
ప్రేయసి - చపల! (ఓ చపలస్వభావం కలవాడా!)
ప్రి - చకోరాక్షి తావకే నయనే
(ఓ చకోరమువంటి కన్నులు గలదానా! నీకన్నులే చపలములు నేనుగాదు.)
ప్రే.- కుటిల! (వంకర నడతగలవాడా!)
ప్రి.- సుకే శ్యలకా స్తే
(మంచి వెంట్రుకలుగలదానా! నీముంగురులే కుటిలములు నేనుగాదు)
ప్రే.- మిథ్యావాదిన్! (కల్లరీ!, మిథ్యను పలికేవాడా!)
ప్రి. - లతాంగి తవ మధ్యమ్
(తీగెవలె సన్ననిశరీరంగలదానా! నీ నడుమే మిథ్య(కల్ల) నేను కాదు)
**************************************************************************

# కాళిదాసు - భోజరాజు

కాళిదాసు చేపలు తింటున్నట్లు భోజరాజుతో కవులు చెప్పినారు.
ఒకరోజు అంగవస్త్రంలో చేపలు చుట్టుకొని కాళిదాసు వెళుతున్నాడు
అది గమనించిన కవులు కాళిదాసును భోజమహారాజు రమ్మన్నారని చెప్పి
కాళిదాసుని పట్టుకొని రాజు దగ్గరకు వెళ్ళారు.

**కక్షే కిం తవ? పుస్తకం! కి ముదకం? కావ్యార్థసారోదకమ్!**
**గంధంకిం? ఘన రామ రావణ మహాసంగ్రామ రంగోద్భవమ్!**

**పుచ్ఛః:కిం? ఘన తాళపత్ర లిఖితం! కిం పుస్తకం హే కవే ?**
**రాజన్! భూసుర దేవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్!**

భోజరాజు - కక్షే కిం తవ? (నీ చంకన ఉన్నది ఏమిటి?)
కాళిదాసు - పుస్తకం! (పుస్తకము!)
భో - కి ముదకం? (ఉదకమేమి?)
కా.- కావ్యార్థసారోదకమ్! (కావ్యార్థసారము!)
భో.- గంధంకిం? (వాసనేమిటి?)
కా.- ఘన రామ రావణ మహాసంగ్రామ రంగోద్భవమ్!
(రామరావణ యుద్ధంలో ఏర్పడినది!)
భో.- పుచ్ఛః కిం? (తోకయేమి?)
కా.- ఘన తాళపత్ర లిఖితం!
(పొడవైన తాటిఆకులపై రాసిన గ్రంథం!)
భో.- కిం పుస్తకం హే కవే? (ఓ కవీ అది ఏ పుస్తకం?)
కా.- రాజన్! భూసుర దేవతైశ్చ పఠితం రామాయణం పుస్తకమ్!
(రాజా దేవబ్రాహ్మణులు పఠించే రామాయణపుస్తకం!)
అంటూ కాళిదాసు భోజుని చేతికి ఆ చేపల మూటను అందిచాడు.

(కాళిదాసు మహిమచే అది తెరచి చూడగా అది రామాయణగ్రంథమే అయింది)

భోజ కాళిదాసుల కథలు అనేకం ఉన్నాయి.
వాటిలో ఇదొకటి. ఇది సంవాద చిత్రం
చూడండి.
ఏ కారణం వల్లో ఒకప్పుడు భోజరాజు కాళిదాసును "భ్రష్టుడా!" అని తిట్టి రాజ్య బహిష్కృతుణ్ణి చేశాడట. కాని త్వరలోనే పశ్చాత్తాపం చెంది మారువేషంలో కాళిదాసును వెదుక్కుంటూ బయలుదేరాడు. ఒక సత్రం ముందు నీళ్లుకారుతున్న మాంసాన్ని చంకన పెట్టుకొని ఒక సన్యాసి ఆయనకు కనబడ్డాడు.
అప్పుడు వారిమధ్య జరిగిన సంభాషణ శ్లోకం ఇది.

"భిక్షో! మాంస నిషేణం కి ముచితం ?" "కిం తేవ మద్యం వివా?
"మద్యం చాపి తవ ప్రియం? "ప్రియ మహో వారాంగనాభి స్సహ"
"వారస్త్రీ రతయో కుత స్తవ ధనం ?" "ద్యూతేన చౌర్యేణ వా"
"చౌర్య ద్యూత పరిశ్రమో2పి భవతాం?" "భ్రష్టస్య కా వా గతి:"

పై శ్లోకం సంభాషణ ఈవిధంగా సాగింది(తెలుగులో)

భోజ.- నువ్వు చూడబోతే పరివ్రాజకుడివి. మాంసాహారం నీకు తగునా?
సన్న్యాసి- పక్కన మద్యం కూడా ఉంటేనే దీని మజా!
భోజ. - ఏమిటి మద్యపానం అలవాటు కూడా ఉందా నీకు?
సన్న్యాసి - ఒంటరిగా మద్యం తాగడంలో హుషారేముంది వారాంగనలతో కలిసి తాగాలి!
భోజ. - వారాంగనల దగ్గరకి వెళ్ళడానికి డబ్బెక్కడిది నీకు?
సన్న్యాసి- జూదం ఆడి కాని, కన్నం వేసి కాని సంపాదిస్తాను..
భోజ.- చౌర్యానికీ జూదానికీ కూడా దిగజారా వన్నమాట?
సన్న్యాసి - భ్రష్టుడైనవాడు మరేం చేస్తాడు?
################################################################################

## కొంగ హంసల సంభాషణ

హంసలాంటిపండితుడు, కొంగలాంటి పామరుడు వారి తారతమ్యం కవి
ఈ కొంగ హంసల సంభాషణలో చిత్రించాడు.

కొంగ - ఎవ్వడ వీవు కాళ్ళు మొగమెఱ్ఱన?
హంస - హంసమ
కొ.- ఎందునుందువో?
హ.- దవ్వుల మానసంబునను
కొ.- దాన విశేషములేమి చెప్పుమా?
హ.- మవ్వపు కాంచనాబ్జములు, మౌక్తికముల్ కలవందు
కొ.- నత్తలో?
హ.- అవ్వి యెఱుంగమన్న
నహహ........ యని నవ్వె బకంబులన్నియున్

## మార్జాల దాంపత్యం

మనం గమనిస్తూనే ఉంటాం రకరకాల వ్యక్తులను, రకరకాల భార్యాభర్తలను.
వారిలో ప్రతిదానికీ కీచులాడుకొనేవారూ కనబడుతూ ఉంటారు.
వారి దాంపత్యాన్ని మార్జలదాంపత్యం అంటూ ఉంటారు.
అలాంటి ఒక దంపతుల సంభాషణ
ఈ శ్లోకంలో కవి చూపాడు చూడండి.

**ఆ: పాకం నకరోషి పాపిని కథం? పాపీ త్వదీయ: పితా!**
**రండే జల్పసి కిం ముధా కలహిని? రండా త్వదీయ స్వసా!**
**నిర్గచ్ఛస్వ హటాన్మదీయ భవనాత్! నైదం త్వదీయం గృహం!**
**హా! విశ్వేశ్వర దేహిమేద్య మరణం! శప్పం మదీయం గతమ్!**

భర్త - పాపాత్మురాలా! వంట చెయ్యలేదా?
భార్య - నీ తండ్రి పాపాత్ముడు!
భ.- రండా! ఏమి ప్రేలుచున్నావు?
భా.- నీ చెల్లెలు రండ.
భ. - నా యింటినుండి వెంటనే పొమ్ము!
భా. - ఇది నీ యిల్లు కాదు!
భ. - హా పరమేశ్వరా నాకు మరణము నిమ్ము!
భా.- నా వెంట్రుక పోయినదనుకొందును.

---

కావ్యాలంకారం సంగ్రహం వివరణములో ఉదాహృతమైన స్మరణాలంకార
ఉదాహరణ.
ఇది సంవాద చిత్రంలో ఉంది గమనించండి.

సౌమిత్రే !నను సేవ్యతాం తరుతలం చండంశు రుజ్జృంభతే
చండంశో ర్నిశి కా కథా? రఘుపతే! చంద్రో2యమున్మీలతి
వత్సైత ద్విదితం కథంనుభవతా? ధత్తే కురంగం యత:
క్వాసి ప్రేయసి! హా కురంగ నయనే! చంద్రాననే! జానకీ!

శ్రీరాముడు- లక్ష్మణా! ఎండ కాయుచున్నది చెట్టునీడకు పద
లక్ష్మణుడు- శ్రీరామా రాత్రి సూర్యు డెక్కడ?
చంద్రుడు వెన్నెల కాయుచున్నాడు.
రాముడు- నీకు చంద్రుడని ఎట్లు తెలిసింది?
లక్ష్మణుడు- అందు కురంగమున్నది.
రాముడు- హా! కురంగనయనా! సీతా! ఎటనుంటివి.
అని సీతాస్మరణము కలిగినది.

---

పూర్వకాలంలో చిన్నపిల్లలకే పెళ్ళిళ్ళు చేసేవారుకదా!
అలాంటి బాలవధువు(12,13 సం.లోపు పిల్ల) పురుషాసక్తత అసలే లేని పిల్ల
తన తల్లితో ఇలా చెబుతున్నది.

**మాత! శ్వశ్రుగృహం నయామి శయితుం, కస్మాచ్ఛ చంద్రాననే?**
**జామాతా అతినిర్దయో భుజలతాపాశేన మాం పీడతే**
**వక్షోజగ్రహణం కరోతి సతతం ఓష్ఠం దశత్యాదరాత్**
**నీవీబంధ విమోచనంచ కురుతే నిద్రాం నలేభే నిశి**

బాలిక - అమ్మా! నేను అత్తవారింటికి శయనానికి వెళ్ళను.
అమ్మ - చంద్రముఖీ! కారణమేమి?
బాలిక - నీ అల్లుడు దయారహితుడు!
నన్ను గట్టిగా కౌగిలించుకొంటున్నాడు.
ఉరోజములను ఎప్పుడూ పట్టుకొంటున్నాడు.
పెదవి కొరుకుతున్నాడు.
చివరకు చీరముడికూడా విప్పేస్తున్నాడు.
రాత్రంతా నిద్రలేకుండా చేస్తున్నాడు!

## అత్తవారి ఇల్లు ఎలాంటిది?

అత్తవారి ఇల్లు ఎలాంటిది? - అనేది ఒక ఊహాజనిత ప్రశ్న
దానికి సమాధానంగా
ఈ శ్లోకం
దాని కథ తెలుసుకుందాం.

**శ్వశుర గృహనివాస: స్వర్గతుల్యో నరాణాం**
**యది భవతి దరిద్రో పంచ వా షడ్దినాని**
**దధి మధు ఘృత లోభాత్ మాసమేకం వసేత్ చేత్**
**తదుపరి దిన మేకం పాదరక్షా ప్రయోగ:**

ఒక మామగారి ఇంటికి ఒకేసారి మనుగడుపు
(వివాహానంతరం అత్తవారింట్లో చేసే విందు,
దీన్నే కొన్ని ప్రాంతాల్లో అల్లెం తినటానికి అంటారు)ల
కోసం విచ్చేశారట. ఎంత ధనం, ఓపిక, ప్రేమగలవారైనా,
ఎంత బాగా పెట్టాలనుకున్నా, ఎంతకాలమని,
అల్లుళ్ళకు తినుబండారాలు, సేవలు చేయగలరు
వారికే మాత్రం విసుగు పుట్టకుండా ఉంటుందా!
ఇలా ప్రతి దినం, పీకలదాకా మెక్కి పరిహాసాలాడుకుంటున్న
అల్లుళ్ళలో ఒకరి బుద్ధివచ్చి అత్తవారిల్లు అన్ని విధాలా స్వర్గసుఖాలలో

ఒలలాడిస్తుంది అనే అర్థం వచ్చే పైశ్లోకంలోని
మొదటిపాదం
(**శ్వశుర గృహనివాస: స్వర్గతుల్యో నరాణాం**),
అత్తవారింటి గోడపై రాసి వెళ్ళిపోయాడు.
మరి కొన్ని రోజులకు రెండవవాని బుద్ధివచ్చి,
అత్తవారిల్లు ఎంత స్వర్గసీమ అయినా, 5,6 రోజులకంటే మించి ఉండటం
మంచిదికాదు(**యది భవతి దరిద్రో పంచ వా షడ్దినాని**) అని
రెండవ పాదం గోడమీద రాసి ఉడాయించాడు.
మరికొన్ని రోజులకు మూడవ అల్లుడు అజీర్ణవ్యాధి తెచ్చుకొని
ఎవో అత్త వారింట అనాయాసంగా గడ్డ పెరుగు, పాలు, పిండి వంటలు
వడ్డిస్తున్నారుకదా! అనే అర్థం వచ్చే
(**దధి మధు ఘృత లోభాత్ మాసమేకం వసేత్ చేత్**)
మూడవ పాదాన్ని అసంపూర్ణంగానే రాసి ఫలాయనం మంత్ర పఠించాడు.
ఇక నాలుగవ వాడు మాత్రం తిని త్రేపి వారిమీద పెత్తనం కూడా చేస్తూ,
ఇవికావాలి, అవికావాలి అని అధికారం చెలాయించడంతో,
పాపం బావమరుదులైనా ఏంచేస్తారు? ఎంత కాలం అని భరిస్తారు?
ఏమి చేసేదిలేక ఆగ్రహోదగ్రులై చెప్పుతో నెత్తిని బొచ్చు ఊడేదాకా
నాలుగు దెబ్బలు కొట్టారు. దానితో ఆ నాలుగవ వాడుపారిపోతూ,
ఆదరాబాదరగా
తిండి మీద ఆశతో నెలల కొద్ది తిష్ఠవేస్తే, ఆ తర్వాత చెప్పుదెబ్బలు తప్పవు
(**తదుపరి దిన మేకం పాదరక్షా ప్రయోగ:**) అనే అర్థం
వచ్చే నాల్గవ పాదాన్ని రాసి పారిపోయాడు.

అసలు విషం ఏంటంటే ఏంత ఆశపోతులైనా,
అత్తవారింట్లో ఎక్కవ రోజులు ఉండరాదు
- అనేది భావం.

---------------------------------------------------------------------------------------------------

=====================================================================

ఒకరితో ఒకరు మాట్లాడటమే సంవాదం కాదు.
మనలో మనమే ప్రశ్నించుకొని సమాధానాలు
చెప్పుకుంటూంటాము అవి కూడా సంవాదాలే.
ఒకడు తనలో తాను ప్రశ్నించుకొని,
ప్రతి వచనం చెప్పుకుంటాడు.
దానికి ఉదాహరణ ఈ శ్లోకం చూడండి.

**హాలాహలో నైవ విషం విషం రమా**
**జనా: పరం వ్యత్యయ మత్ర మన్వతే**
**నిపీయ జాగర్తి సుఖేన తం శివ:**
**స్పృశన్నిమాం ముహ్యతి నిద్రయా హరి:**

పూర్వం దేవదానవులు పాసముద్రాన్ని తరచినపుడు పుట్టిన
ఈ హాలాహలం అనే విషం సంగతి తెలియక ప్రజలు దాన్ని
ఘోరకాకోల విషం అన్నారు.
వాస్తవానికి అది పూర్తిగా అబద్ధం.
అసలైన విషం ఏందంటే - అది లక్ష్మి(సంపద)
ఎందుచేతంటారా?
ఆలోచించిచూస్తే నిజంగా
దాన్ని మస్తుగా(పూర్తిగా) తాగిన శివుడు,

ఏ ఇబ్బంది,
చావు లేకుండా హాయిగా, సుఖంగా మేల్కనే ఉన్నాడు.
కాని,
సముద్రంలో పుట్టిన అసలు విషం అయిన
లక్ష్మిని(సంపదను) తాకినంత మాత్రాన్నే
తన్మయత్వం చెందిన విష్ణువు మాత్రం మూర్చితుడైనట్లు
నిద్రాముద్రుడై ఉన్నాడుసుమా!
కనుక అసలు విషమంటే లక్ష్మి(సంపద)యే అని భావం.
మధ్యలో వచ్చిన సంపదతో అతడు మతమత్తచిత్తుడై,
కళ్ళుమూసుకుపోయినాడని గూఢార్థం.
++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++

## లక్ష్మి - పార్వతుల సంవాదం

**శ్లో. భిక్షార్థీ స క్వయాత:? సుతను బలిమఖం! తాండవం క్వాద్య భద్రే?**
**మన్యే బృుదావనాంతే! క్వను స మృగశిశు:? నైవజానే వరాహమ్!**
**బాలే! కచ్చిన్నదృష్టో జరఠ మృగపతి:? గోపయేవాత్ర వేత్తా!**
**లీలా సంలాప ఇత్థం జలనిధి హిమవత్కన్యయో: త్రాయతాం న:!**

లక్ష్మి - బిచ్చగాడు ఎక్కడకు వెళ్ళాడు?

పార్వతి - బలియజ్ఞమునకు!

లక్ష్మి - ఈనాడు తాండవం ఎక్కడ?

పార్వతి - బృందావనంలో అనుకొందును!

లక్ష్మి - ఆ జింకపిల్ల ఎక్కడ?

పార్వతి- ఏమో ఆ వరాహమును నేనెరుగను!

లక్ష్మి - బాలా ముదుసలి ఎద్దు కన్పించలేదా?

పార్వతి- గోవులను కాయువానికే తెలియును!
ఈ విధంగా సాగిన లక్ష్మి - పార్వతుల సంవాదం మిమ్ము రక్షించుగాక!

మరొక సంవాద చిత్రం

**ఈ క్రింది శ్లోకం వాయువుకు మామిడి కొమ్మకు మధ్య జరిగిన సంభాషణ.**

శ్లో. చిరశ్రాంతో దూరాత్ అహముపగతో హన్త మలయాత్
తదేకం త్వద్గేహే తరుణి పరిణేష్యామి దివసమ్
సమీరేణోక్త్యేవం నవకుసుమితా చూతలతికా
ధునానా మూర్ధానం నహి - నహి - నహీ త్యేవ వదతి

మండు వేసవిలో వాయువు మామిడి కొమ్మతో -

"నేను మలయ పర్వతం నుండి అలసి వచ్చాను.

నీ దగ్గర ఒక్కనాడు గడుపదలచాను" - అని అన్నాడు.

దానికి కొత్తగా పుష్పవతి అయిన ఆ మామిడి కొమ్మ

"వద్దు! వద్దు! వద్దు!" - అని మూడుసార్లు అన్నది.

(దీని భావమేమంటే మూడు రోజులు ఆగు అని.)

## అమ్మా! నాకూజా తెమ్మ

లీలాశుకుని శ్రీకృష్ణామృతములోని
యశోదాకృష్ణుల సంవాదము చూడండి-

# మాతః కిం యదునాథ దేహి చషకం కిం తేన పాతుం పయ
# స్తన్నా స్త్యద్య కదాస్తి వా నిశి నిశా కావా2న్ధకారోదయః,
# ఆమీ ల్యాక్షియుగం నిశా ప్యుపగతా దేహీతి మాతుర్ముహు
# ర్వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణ స్స పుష్ణాతు నః

కృష్ణుడు - హేమాతః!
(ఓ అమ్మా!)
యశోద - కిం యదునాథ?
(ఓ యాదవులరాజా ఏమిరా?)
కృ- దేహి చషకం
(నాకూజాను తెమ్మ)
య- కిం తేన?
(దానితో ఏమి పని)
కృ - పాతుం పయః
(పాలను త్రాగుటకు)
య - తత్ ఆద్య నాస్తి

((ఆ గిన్నె)ఆపాలు ఇప్పుడు లేవు)
కృ - కదా ఆస్తినా?
(ఎప్పుడు ఉంటాయి)
య - నిశి
(రాత్రి యందు)
కృ - నిశా కా?
(రాత్రి అంటే ఏది)
య - అన్ధకారోదయః
(చీకటి పడుట)
అనగానే
ఆమీల్యాక్షియుగం
(రెండు కన్నులు గట్టిగా మూసుకొని)
కృ - నిశాప్యుపగతా దేహీతి
(రాత్రికూడ వచ్చింది పాలగిన్నె తెమ్మ)
అని
మాతుః వక్షోజాంశుకకర్షణోద్యతకరః కృష్ణ స్స పుష్ణాతు నః!
తల్లి అయిన యశోద పైటకొంగును లాగుటకై చాచబడిన చేయిగల ఆ శ్రీకృష్ణడు మమ్మ రక్షించుగాక!

## తలుపు తట్టువాడెవ్వడు?

లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతంలోని
ఈ సంవాద చిత్రం చూడండి-
గోపిక - కృష్ణులసంవాదం ఇది చూడండి-

**అఙ్గుళ్యా కః కవాటం ప్రహరతి?**
**కుటిలే మాధవః,**
**కింవసన్తో?**
**నో చక్రి,**
**కిం కులాలో?**
**నహి ధరణిధరః,**
**కింద్విజిహ్వః ఫణీన్ద్రః?**
**నాహం ఘోరాహిమర్ది**
**కిమసి ఖగపతి?**
**నో హరిః**
**కిం కపీన్ద్రః?**
**ఇత్యేవం గోపకన్యా**
**ప్రతివచనజితః**

## పాతు వ శ్చక్రపాణిః

గోపిక - **అంగుళ్యా కః కవాటం ప్రహరతి?**
(ఎవ్వడు వ్రేళ్ళతో తలుపు తడుతున్నది)

కృష్ణుడు - **కుటిలే మాధవః**
(వంకరగా ఆలోచించేదానా మాధవుడను)

గోపిక - **వసంతః కిం?**
(వసంతుడవా ఏమి)

కృ - **నో చక్రీ** (కాదు, చక్రముకలవాడను)

గో- **కిం కులాలః?**
(ఓహో కుండలు చేసే కుమ్మరివా)

కృ - **నహి ధరణీధరః**
(కాదు సమస్త భూమిని ధరించినవాడను)

గో- **కిం ద్విజిహ్వః ఫణీంద్రః?**
(అట్లా నిజం చెప్పు, ఓహో భూభారం మోసే
రెండునాల్కలుగల ఆదిశేషునివా)

కృ - **నాహం, ఘోరాహిమర్దీ**
(అబ్బేకాదు, నేను ఆకళింగ సర్పాన్ని మర్దన చేసినవాడను)

గో - **కిమసి ఖగపతిః?**
(ఓహో అదా సంగతి. పాములను పట్టి తినే పక్షీంద్రునివా)

కృ - **నో హరిః ?**
(కాదు, నేను హరిని)

గో- **కిం కపీంద్రః?**
(అయితే పెద్దకోతివి అన్నమాట)

**ఇత్యేవం గోపకన్యాప్రతివచనజితః పాతు వ శ్చక్రపాణిః**
ఈవిధంగా గోపిక యొక్క బదులుమాటలచేత ఓడిపోయిన
చక్రపాణి(కృష్ణుడు) మమ్ము రక్షించుగాక

ఇందులో **మాధవుడు - విష్ణువు, వసంతుడు**
**చక్రి - చక్రమును ధరించువాడు**
**(విష్ణువు, కుమ్మరివాడు)**
**ధరణీధరుడు - భూమిని ధరించినవాడు**
**(విష్ణువు, ఆదిశేషుడు)**
**అహిమర్ది - పాములను మదించువాడు**
**(కాళీయమర్దనుడు, గరుత్మంతుడు)**
**హరి - విష్ణువు, కోతి**

ఈ విధంగా శ్లేషార్థాలు ఉండటంవల్ల
సంవాదం రసవత్తరంగా సాగింది.

## కస్త్వం బాల? బలానుజః

లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతంలోని
ఈ సంవాద చిత్రం చూడండి.
ఇది గోపికకు బాలకృష్ణునికి
మధ్యజరిగిన సంవాదం

**కస్త్వం**
**బాల బలానుజః కిమిహతే మన్మన్దిరాశఙ్కయా**
**యుక్తం తన్నవనీతపాత్రవివరే హస్తం కిమర్థం న్యసేః,**
**మాతః కఞ్చన వత్సకం మృగయితుం మాగా విషాదం క్షణా**
**ది త్యేవం వరవల్లవీ ప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః**

గోపిక - కస్త్వం బాల?(ఎవరు నీవు?)

బాలకృష్ణుడు - బలానుజః (బలరాముని తమ్ముని)

గో- కిమిహతే? (ఇక్కడ ఏమిపని?)

బా.కృ- మన్మన్దిరాశఙ్కయా(మాయిల్లనుకొని భ్రమతో వచ్చాను)

గో- యుక్తం తన్నవనీత పాత్రేవివహే హస్తం కిమర్థం న్యసేః
( అదిసరే వెన్న కుండలో చేయెందుకు పెట్టావు)

బా.కృ.- మాతః కఞ్చన వత్సకం మృగయితుం
(మా దూడ ఒకటి తప్పి పోయినది- అది ఈ బానలో
ఉందేమో నని వెదకుచున్నాను)
మాగా విషాదం క్షణాద్
(కొంచెం సేపు ఊరకుండు పోతానులే)

ఇత్యేవం వరవల్లనీ ప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః!
ఈవిధంగా గొల్లపడుచుకు జవాబులిచ్చు
కృష్ణుడు మమ్ములను రక్షించుగాక!

## ఆంధ్ర భాషా మయం కావ్యం

ఒకమారు శ్రీకృష్ణదేవరాయల కొలువుకు వచ్చిన
సంస్కృతపండితుడు ఆంధ్రభాషను ఈ సడిస్తూ
ఈ విధంగా చెప్పారు-

**ఆంధ్ర భాషా మయం కావ్యం**
**అయోమయ విభూషణం**

(ఆంధ్రభాషా కావ్యం ఇనుముతో చేసిన
ఆభరణం లాంటిది- అని భావం)

అది విన్న తెనాలి రామకృష్ణకవిగారు
ఈ విధంగా అన్నారట-

**సంస్కృతారణ్య సంచారి**
**విద్వన్మత్తేభ శృంఖలం**

(సంస్కృతం అనే అడవిలో తిరిగే
మదించిన ఏనుగులాంటి విద్వాంసునికి
కాలి సంకెల ఆ భూషణం - అని భావం.)

## భూపాలుండ రక్షించవే

కామినేని మల్లారెడ్డి గారి షట్చక్రవర్తి చరిత్రలోని
కార్తవీర్యార్జునుని కథలో తన తండ్రి యనంతరము
రాజ్యభారము వహించుటకు కార్తవీర్యార్జునుడు
ఇష్టపడలేదు. గర్గుని బోధనవలన దత్తాత్రేయుని
సేవించడాని వెళ్ళాడు. నిరంతరము మదవతీలోలుడును,
మద్యపానరతుడు అయి కాలము బుచ్చుతున్న దత్తాత్రేయ
యోగిని, కార్తవీర్యార్జుననకు మధ్యజరిగిన సంభాషణ చిత్రం ఇది.

**ఓరీ యర్భక, నీ వదెవ్వఁడవురా ఓ సామి,**
**భూభృన్మణిన్**
**మేరుగ్రావమవో మహాత్మ యినుఁడన్**
**నీరేజమిత్రుండవో**
**కారుణ్యాకర, రాజ శీతఘృణివో కానయ్య, యీ**
**ధరుణీ**

## భారం బూనిన కార్తవీర్యుడను భూపాలుండ రక్షింపవే

(షట్చక్రవర్తి చరిత్ర 8-28)

**దత్తాత్రేయుడు- ఓరీ! యర్భక, నీ వదెవ్వఁడవురా?**
**కార్తవీర్యుడు - ఓ సామి, భూభృన్మణిన్**
**దత్తాత్రేయుడు- మేరుగ్రావమవో?**
**కార్తవీర్యుడు- మహాత్మ యినుఁడన్**
**దత్తాత్రేయుడు - నీరేజమిత్రుండవో?**
కార్తవీర్యుడు- కారుణ్యాకర, రాజ
**దత్తాత్రేయుడు- శీతఘృణివో?**
**కార్తవీర్యుడు- కానయ్య, యీ ధరుణీభారం బూనిన**
**కార్తవీర్యుడను భూపాలుండ రక్షింపవే**

## పిపాసిత: కిం ద్వికరేణ పీతే?

బిల్హణుడు ఆయన భార్య మాట్లాడుకున్న
శ్లోకాలు ఎంత చమత్కారంగా ఉన్నాయో చూడండి-
ఇది సంవాదచిత్రంగా చెప్పవచ్చు-

రాత్రి మొదటిజాములోనే సురత క్రీడకు
బిల్హణుడు తొందరపడుతున్నాడు.
అప్పుడు
**ఆమె ప్రియునితో-**

## జాగర్తిలోకో - జ్వలతిప్రదీప:
## సఖీజనో ద్వీక్షతి కౌతుకేన
## ముహూర్తమాత్రం కురుకాంత ధైర్యం
## బుభుక్షిత: కిం ద్వికరేణ భుంక్తే?

(అందరు మెలకువగా ఉన్నారు.
పెద్ద దీపాలు వెలుగుతున్నాయి.
సఖురాండ్రు మనలను గమనిస్తున్నారు.
ఓ మనోహరా ముహూర్తకాలం ధైర్యమవలంబించు
ఎంత ఆకలి వేసినా రెండు చేతులతో తింటారా)

**దానికి బిల్హణుని సమాధానం-**

## జాగర్తిలోకో - జ్వలతిప్రదీప:
## సఖీజనో ద్వీక్షతి కౌతుకేన

**ముహూర్తమాత్రం కురుకాంత ధైర్యం
పిపాసిత: కిం ద్వికరేణ పీతే?**

(అందరూ మెలకువతో ఉండిన ఉండనీ
పెద్దదీపాలు వెలిగితే వెలగనీ
నీచెలికత్తెలు ఉత్సాహంగా చూస్తుంటే చూడనీ
నేనింక ముహూర్తకాలం ధైర్యంవహించలేను
దప్పికగొన్నవాడు రెండు చేతులతో త్రాగడా)

## స్తుతిమతియైన ఆంధ్రకవి

భువనవిజయంలో శ్రీకృష్ణదేవరాయలు
ధూర్జటిని గురించి
ఈ విధంగా పద్యం ప్రారంభించగా---

**స్తుతిమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనీ
అతులిత మాధురీ మహిమ........**

అనగానే తెనాలిరామకృష్ణుడు అందుకొని

**.....హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వార వనితా జనతాపహారి సం
తత మధురాధరోధిత సుధారస ధారల గ్రోలుటం జుమీ**

- అని అన్నాడు.
ఈ అధిక్షేపణ సమాధానం ప్రసిద్ధమైనవి.

కానీ ఒకసారి

భువనవిజయనాటకంలో
ధూర్జటి పాత్రవేసిన **వావిలాల సోమయాజులు**గారు
(రామకృష్ణుని పద్యపూరణ) వెంటనే
ఈ విధంగా చెప్పారు-
-------

**ఔ తెలియందగు లోక మోహనో
ద్ధత సుమసాయక ప్రబల తాపమహోజ్వల పూజ్య పార్వతీ
పతి పదమంజులాబ్జ మధుపాన మధువ్రతుడై చెలంగుటన్**

(నాకు కవిత్వ మాధుర్యం లభించింది.
వేశ్యాధర పానం చేయటం వల్ల కాదు.

శివ పదాంబుజ మధుపానం చేయటంవల్ల
- దీని భావం)

## నా కీ పచ్చడమె చాలు నయముగ నిమ్మా!

కృష్ణదేవరాయల వాకిటిని కాపలాకాయు
తిమ్మనికి రాజుగారు ఎప్పుడో మంచి
సేవలకుగాను ఒక సేలువా ఇచ్చాడట.
దాన్ని కప్పుకొని తిరుతున్న సమయంలో
దాన్ని తెనాలి కామకృష్ణుడు చూచాడట.
ఎలాగైనా దాన్ని కాజేయాలని ఎదురు చూస్తున్నాడు.
ఒకరోజు అతనికి ఒక పద్యమైనా కృతి తీసుకోమని సలహా ఇచ్చాడు.
అది ఊరకే ఇవ్వరుకదా అని అనగా
పద్యంలో నాలుగు పాదాలు నలుగురిని అడుగు
అప్పుడు ఎవరికి ఏమీ ఇవ్వకుండా
సరిపోతుందని ఉపాయం చెప్పాడు.
అది సరైనదేనని మరునాడు సభలోకి
వెళ్ళే కవులను తనకోరిక చెప్పి
పెద్ధనను మొదట అడిగాడు దానికి
ఆయన ఒక చరణం చెప్పాడు
తరువాత భట్టుమూర్తి రెండవ చరణం చెప్పాడు,
మూడవ చరణం తిమ్మన చెప్పాడు
నాలుగవచరణం తెనాలిరామకృష్ణుడు చెప్పాడు
ఆచరణంతో చివరకు ఆ శాలువా మారుపలుక్కుండా ఇచ్చాడట.
ఆ పద్యం-

**పెద్దన -** **వాకిటికావలితిమ్మా!**
**భట్టుమూర్తి-** **ప్రాకటమగు సుకవివరుల పాలిటి సొమ్మా!**
**తిమ్మన -** **నీకిదె పద్యము కొమ్మా!**
**రామకృష్ణుడు -** **నా కీ పచ్చడమె చాలు నయమున నిమ్మా!**

ఈ పద్యం నలుగురు చెప్పినా
అంత్యనుప్రాసలో చెప్పడం గమనార్హం.

## కాంతాధర: కేవలమ్

ఇదొక ప్రేయసి - ప్రియుల సంభాషణ చూడండి

**ప్రాణప్రేయసి! మా పిబంతు పురుషా: పిత్తజ్వరవ్యాకులా:**
**నానావల్లిజలం విలంబితఫలం పానే విషాదప్రదమ్**
**తత్తై: కిం క్రితాం చిక్నకపతే! ముగ్ధే సుఖం సేవ్యతాం**
**సద్యస్తాపహరస్సుధాధికతర: కాంతాధర: కేవలమ్**

(లోలంబరాజీయమ్)

ప్రియుడు- **ప్రాణప్రేయసి! మా పిబంతు పురుషా: పిత్తజ్వరవ్యాకులా:**
**నానావల్లిజలం విలంబితఫలం పానే విషాదప్రదమ్**
**తత్తై:**
(ఓ ప్రియురాలా పురుషులకు పైత్యజ్వరం వచ్చి బాధపడుతున్నపుడు
అనేకరకాల మూలికలతో తయారుచేసినది, ఆలస్యంగా ఫలితాన్నిచ్చేది,
త్రాగేప్పుడు వగరుగా ఉండి చికాకు కలిగించేది. అయిన కషాయాన్ని
తాగవద్దు)

ప్రేయసి - **కిం క్రితాం చికస్కపతే!**
(అయితే వారేం చేయాలి?)
ప్రియుడు - **ముగ్దే సుఖం సేవ్యతాం**
**సద్యస్తాపహరస్సుధాధికతర: కాంతాధర: కేవలమ్**
(ఏమీలేదు. వెంటనే తాపాన్ని హరించేదీ, అమృతంకంటే ఎక్కువ
రుచిగా
ఉండేదీ అయిన తన ప్రియురాలి అధరామృతం ఆస్వాదిస్తే చాలు.
వెంటనే అతని పైత్య జ్వరం నిమ్మళిస్తుంది)

## పుత్రక యెందు బోయితివి?

**గరుడాచలకవి** కృత
**కౌసలేయ చరిత్రము** లోని
సంభాషణచిత్రం చూడండి.
గద్వాలవారి ఆడబడుచుఅయిన గిరియమ్మ
కవులను సత్కరించటం, విద్యార్థుంకు చదువు చెప్పించటం,
దేవాలయాలను, తోటలను నిర్మించటం, తీర్థయాత్రలను చేయటం
వంటి ధర్మకార్యాలెన్నో చేసింది. ఆమె గరుడాచలకవితో
కౌసలేయ చరిత్రం వ్రాయించి కేశవస్వామికి అంకితం చేయించింది.
ఆమె ధర్మసత్రం గురించిన సంభాషణ ఈ పద్యంలో కనిపిస్తుంది

**పుత్రక యెందు బోయితివి? బోర్వెలిలో గిరియమ్మ వెట్టు బ**
**లస్సత్రములో భుజించపటకు! సత్ర విశేషములేమి? చూడు నా**
**గాత్రము! త్రావితో సుధ? జగజ్జనులందరు ద్రావద్రావుటే**
**చిత్రము? నేనటంచు వచియించును బ్రహ్మకు నారదుండటన్**

ఇది బ్రహ్మ - నారద సంభాషణ -
బ్రహ్మ - కుమారా! నారదా! ఎక్కడికి వెళ్ళావు?
నారదుడు - బోర్వెల్లి అనే గ్రామంలో గిరియమ్మ పెట్టిన
ధర్మశాలలో భుజించుటకు వెళ్ళాను.
బ్రహ్మ - ఏమి ఆ సత్రపు విశేషాలు?
నారదుడు - నాశరీరాన్ని చూడు,నీకే తెలుస్తుంది
బ్రహ్మ - అమృతం త్రాగావా ఏమి?
నారదుడు - లోకంలోని జనమంతా
త్రాగగాలేనిది నేను అమృతం
సేవించటంలో వింతేమి!

## ఏ కాలమైనా అంతే

ఇందులో కవి సమకాలీన దుస్థితిని తెలుపుతున్నాడు.

**కస్త్వం భో:? కవిరస్మి, కాప్యభినవాసూక్తి:? సఖే పఠ్యతాం**
**త్యక్తా కావ్యకథైవ సంప్రతి మయా, కస్మాదిదం కథ్యతే**
**యస్సమ్య గ్వివినక్తి దోష గుణయో: పారం స్వయం సత్కవి:**
**సో2స్మిన్భావుక ఏవ నాస్త్యథ భవే ద్దైవాన్న నిర్మత్సర:**

**ప్రశ్న -** **ఓయి నీవెవరవు?**
**జవాబు- నేను కవిని**
**ప్ర. - మిత్రమా! ఏదో ఒక కొత్త కవిత విన్పించు**
**జ. - నేనిప్పుడు కవిత్వం రాయడమే మానుకున్నాను.**
**ప్ర. - ఎందువలన**
**జ. - కవిత్వంలోని తప్పొప్పులను చక్కగా విమర్శించే వాడు గాని,**
**బాగా అర్థం చేసుకొని సారాన్ని తెలుసుకొనేవాడుగాని**
**లేనప్పుడు కవిత్వం రాసి లాభమేమి? భావుకుడేలేడు.**
**ఒక వేళ ఉన్నా వాడు అసూయాద్వేషాలకు అతీతుడు కాడు.**

పై సంవాదం వల్ల తెలిసేదేమిటంటే సరైన విమర్శకుడు
లేకపోతే కవిత విలువ గుర్తింపబడదని కవి ఆవేదన చెందాడు.

## ఎవరయామీరు చక్కని రాజులిద్దరు?

హనుమంతుడు రామలక్ష్మణులతో కలిసి మాట్లాడిన
సందర్భములోని సంభాషణ చిత్రమిది-

హనుమంతుడు - **ఎవరయా మీరు చక్కని రాజులిద్దఱున్?**
లక్ష్మణుడు - **అర్కవంశ్యుల మయోధ్యాపురంబు**
హనుమ- **మీపేరు లెవరయా ఓ పుణ్యనిధులార?**
లక్ష్మణుడు - **రాఘవుండతఁడు నే లక్మణుండ**
హనుమ - **దండంబు దండంబు దశరథ సుతులార**
రామలక్ష్మణులు - **వర్థిల్లు వర్థిల్లు వానరేంద్ర**
హనుమ - **ఎందు వేంచేస్తిరో యినకులోత్తములార?**
లక్ష్మణుడు - యిచ్చోట కార్యంబు నెఱుఁగ వస్తి
హనుమ - **వాయుపుత్రుండ హనుమను వచ్చినాను**
**భానుపుత్రుండు సుగ్రీవు బంటునేను**
**చెలిమిని మీకును మీకును జేయఁగాను**
**అతఁడు మీున్నచోటికి నంపగాను**
(చాటుపద్యమణిమంజరి - 848)

## పతంతి గిరయోహ్యపి

ప్రేయసి - ప్రియుల సంభాషణ -

ప్రియుడు - **కిం కారణం స్తనద్వంద్వం పతితం బ్రూహిమే ప్రియే?**
(ప్రేయసీ! నీకుచములు ఒరిగిపోయినవేమి? )
ప్రేయసి - **పశ్యాధ: ఖననాత్ మూర్ఖ! పతంతి గిరయోహ్యపి!**
(మూర్ఖుడా! క్రింద త్రవ్వితే ఎంటి పర్వతాలైనా ఒరిగిపోతాయికదా!)

ఎంత చమత్కారంగా ఉందోకదా ఈ సంభాషణ.

## పేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా

ఒకానొక రోజు భువనవిజయంలో
కృష్ణదేవరాయలు సభలోని
అష్టదిగ్గజములకు
ఈ విధంగా పలికాడు.
సంస్కృతం తెలుగు సమానంగా కవిత్వం చెప్పిన వారికి
ఈ గండపెండెరము తొడుగుతానని కవిత్వం చెప్పమని చెప్పాడు.
సభలోని వారెవరు ముందుకు రాకపోవడంతో కృష్ణదేవరాయలు
ఈవిధంగా పద్యంలోని రెండు పాదాలను చెప్పాడు.

కృష్ణదేవరాయలు-
**ముద్దుగ గండపెండియరమున్ గొనుఁడంచు బహూకరింపగా**
**నొద్దిక నా కొసంగమని యొక్కరు గోరగలేరు లేరొకో**

దీనికి ప్రతిగా పెద్దనగారు చెప్పిన రెండు పాదాలు-

పెద్దన-
**పెద్దనబోలు సత్కవులు పృథ్విని లేరని నీవెరుంగవే**
**పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా**

అని పలికి ఆశువుగా -

**పూతమెఱుంగులుం బసరుపూప బెడంగులుఁ జూపునట్టి వా**
**కైతలు జగ్గునిగ్గు నెనగావలెఁగ్రమ్మన గమ్మనన్వలెన్**
**రాతిరియుంబవల్మఱపురాని హొయల్ చెలియారజంపుని**
**ద్ధాతరి తీపులంబలెను దారసిలన్వలెలోఁదలంచినన్**
----------------------
-----------------
-------------------
--------------------
----------------------
----------------------
అని

21 పాదముల ఉత్పలమాలిక చెప్పగా
కృష్ణదేవరాయలు సంతోషంతో
పెద్దనగారికి
గండపెండెరము(కాలికితొడుగు అందె)
తొడిగి సత్కరించాడు.

## నల్లముత్యములు ఎవరైనా చూచారా?

ఔరంగజేబు ఒకరోజు సభలోనివారితో
విచారగ్రస్తుడై విషయాన్ని తెలిపాడు.
తన కుమార్తె జేబున్నీసా నిరంతర సాహిత్య పఠనం కలిగి ఉంది
ఆమెను ఎలాగైనా దాన్నుండి మాన్పించాలి- అని తెలిపాడు.
దానికి కొందరు "మహారాజా! చింతించవద్దు ఆమెకు క్లిష్టమైన
సమస్యను ఒకదాన్ని ఇచ్చి పూరించమనండి
అది ఆమె పూరిస్తే ఆమెను నిరోధించవద్దు.
ఒకవేళ పూరించనిచో సాహిత్యసేవ మానివేయవలెనని చెప్పండి"- అని చెప్పారు.
దానికి ఔరంగజేబు సమ్మతించి ఆమెను పిలిపించి
అదేవిధంగా ప్రశించాడు.
ఆ ప్రశ్న-

**దురేఅబలక్ కసే కమ్ దీద్ మౌజూద్**
(నల్లని ముత్యములు ఎవడైనా ఎక్కడైనా చూచి ఉండెనా)

దానికి తండ్రి ఎత్తుగడ అర్థమైన
జేబున్నీసా సమాధానం -
**వజూజ్ అశకే బతానే సుర్మా అలూద్**
(కజ్జం కలుషితములైన యువతి కన్నీటి
బిందువులు తప్ప ఇతరము చూడలేదు)

దీనికి ఔరంగజేబు ఇంకేమీ చెప్పలేక పోయాడు.

## కనికరమూనక కపట మిడితి

**యడవల్లి వేంకట కృష్ణశాస్త్రి**గారి -
**హరిశ్చంద్రోదయము** నందలి
సంభాషణ చిత్రము చూడండి.

విష్ణుమూర్తికి స్త్రీరూపమున ఉన్న చంద్రునికి
మధ్య సంభాషణ
సీసపద్యంలో.
విష్ణువు - **జాబిల్లినని పల్కి జాగుసేయగనీకు**
**నో భిల్ల కన్యకా యుచిత మగునె**
స్త్రీ - **ఉచితమా ఇటు వల్క నుదధి కన్యావర**
**నిజము దెల్పిన నెనరు లేదె**

వి- నెనరుంచుట గాదె గన వచ్చినను నెద
కనికరమూనక కపట మిడితి
స్త్రీ - కపట నటుండవె గావె నీవెప్పుడు
విపరీతములు బల్క వినుట లేదె
వి.- వినక నిట వచ్చినాడనె వెలది మిన్న
స్త్రీ. - మిన్న తనముకు నీ కన్న నెన్న గలరె
వి.- గలిగి యుండిన నీవిట్లు పలుకుదువటె
స్త్రీ.- బలికితినె సుంత విపరీత భావమిచట.
(4 ఆశ్వాసము పుట. 70)

అని వాదోపవాదము గావించిరి.
చివరకు విష్ణువు మాయచే భిల్లాంగనను వశపరచుకొనెను
వారిరువురి ప్రేమ ఫలితంగా చంద్రునకు బాలుడుదయించెను.
ఆ బాలుని సంతానములేక తపమాచరించు త్రిశంకునకు ఇచ్చివేసిరి.
చంద్రునకు శాపవిమోచనమైనది.
విష్ణువును వెదకుచూ లక్ష్మిరాగా విష్ణువు వెళ్ళెను.

## నాకుమారుడవె యౌట

**చేమకూర వేంకటకవి సారంగధర చరిత్ర**లో
చిత్రాంగి తన మేడకు వచ్చిన సారంగధరునికి
కామవశంతో అధికంగా ఉపచారములు చేయగా
సారంగధరుని ప్రశ్న - చిత్రాంగి సమాధానము
ఈ పద్యంలోనే ఎంత చమత్కారంగా సంభాషణ చిత్రంగా
చెప్పాడో చూడండి.

**జనవరసూను డందులకు చాలప్రియంబు తొలంక, అన్నెలం
తను గని "నీ, కుమారుడ" గదా యిటు తక్కిన వారికింబలెన్
జననిరో! నాకు నింత యుపచారము సేయగ నేటికమ్మ నే
డనుపుడు "నాకు, మారుడవె యౌటను" చేయుదు నంచు పల్కుచున్**

**సారంగధరుడు** - **అమ్మా! నీ కుమారుడను కదా!
నాకింత ఉపచారాలెందుకమ్మా!**
**చిత్రాంగి** - **నాకు మారుడవు**
(నాకు మన్మథుడవగుటచే చేయుచున్నాను)

**నీకుమారుడ** - **నాకు మారుడ** - దీనిలో నీ, నా-ల తేడాలే కాక
**కుమారుడ, కు - మారుడ** అనే
ఒక చిన్న విరుపుతో ఎంత చమత్కారమో కదా!

## కుచంబులాన తమకించుట బాల్యముగాదె

**సారంగధర చరిత్ర**లో **చేమకూర వేంకటకవి**
**సంభాషణచిత్రం** చూడండి.
చిత్రాంగి తన ఇంటికి వచ్చిన సారంగధరునికి
మేనకావిశ్వామిత్రుల చిత్రపటం చూపిస్తూ
ఈ విధంగా చెప్పింది.
దానికి సారంగధరుడు ఇచ్చిన సమాధానం
రెండు ఈ పద్యంలోనే ఉన్నాయి గమనించండి.

**"అల్లన గాధిరాజసుతు డర్మిలి మేనక ముద్దొనర్చ రా**
**గిల్లి కుచంబులాన తమకించుట కంటివె? రాకుమార!" "ఔ**
**నల్ల నగాధిరాజసుతు డర్మిలి మేనక ముద్దొనర్చ రా**
**గిల్లి కుచంబులాన తమకించుట బాల్యముగాదె మానినీ!"**

**చిత్రాంగి-** **"అల్లన గాధిరాజసుతు డర్మిలి మేనక ముద్దొనర్చ రా**
**గిల్లి కుచంబులాన తమకించుట కంటివె? రాకుమార!"**
(విశ్వామిత్రుడు మేనకాకుచ గ్రహణముచేయు
ఈ సన్నివేశము చూచితివా!)

**సారంగధరుడు-** **"ఔనల్ల నగాధిరాజసుతు డర్మిలి మేనక ముద్దొనర్చ రా**
**గిల్లి కుచంబులాన తమకించుట బాల్యముగాదె మానినీ!"**
(మైనాకుడు మేనకాదేవి కుమారుడు ముద్దుపెట్టుకొన
బోవుచుండగా
ఆకలిగొన్న బాలుడు పాలు త్రాగటానికి కుచగ్రహణముచేయుట
బాల్యచేష్టకదా!)

ఈ పద్యంలో కవి చమత్కారం
**అల్లన గాధిరాజసుతు** అనే దాన్ని
మొదటిలో **ఔ** - చేర్చి
**ఔనల్ల నగాధిరాజసుతు** - గా పదాన్ని విరిచి
గాధిరాజసుతుడు - విశ్వామిత్రుడు
విశ్వామిత్రునికి మేనక ప్రియురాలు
నగాధిరాజసుతుడు - మైనాకుడు
మైనాకునికి మేనక తల్లి -
ఎంత చమత్కారం కలిగించాడు కవి.

## అతడేమి సరసుడా? భోజుడయా!

**అడిదము సూరకవి** తండ్రి **బాలభాస్కరుడు**
**శుద్ధాంధ్ర రామాయణ** కర్త వారి స్వగ్రామము **రేగ**.
తండ్రి తరువాత సూరన ఆ ఊరువిడచి
విజయనగరం దగ్గర **చీపురుపల్లి** చేరాడు.
మరొక కవితో మాట్లాడేప్పుడు ఇద్దరి సంభాషణ ద్వారా
ఆ విశేషాలు తెలుస్తున్నాయి.

**ఊ రెయ్యది? చీపురుపలి**
**పేరో? సూరకవి, యింటి పే? రడిదమువార్**
**మీరాజు? విజయరామ మ**
**హారాజ తడేమి సరసుడా? భోజుడయా!**

**కవి - ఊ రెయ్యది?**
**సూరన- చీపురుపలి**
**కవి- పేరో ?**
**సూరన - సూరకవి**
**కవి - ఇంటి పేర్?**
**సూరన - అడిదము వార్**
**కవి - మీరాజు?**
**సూరన- విజయరామ మహారాజ్**
**కవి - అతడేమి సరసుడా?**
**సూరన - భోజుడయా!**

## చతురే కిం ప్రాణేశ:?

నాయిక - సఖి సంవాదము-

**రాగీ భినత్తి నిద్రాం తల్పం న జహాతి నిష్ఠురం దశతి**
**చతురే! కిం ప్రాణేశ: - నహి నహి సఖి! మత్కుణవ్రాత:**

నాయిక - **రాగీ నిద్రాం భినత్తి** (రాగియై నిద్రాభంగం చేయును)
**తల్పం న జహాతి** (పడకను విడువకుండును)
**నిష్ఠురం దశతి** (గట్టిగా కరచును)

సఖి - **చతురే! కిం ప్రాణేశ:?**
(ఓ చతురురాలా! నీ ప్రాణేశుడేనా?(అట్లాచేసింది))
(తల్పము విడువక నిద్రాభంగం చేసి దంతాలతో కరచింది
నీ ప్రాణేశుడేనా?)
నాయిక - **నహి నహి సఖి మత్కుణవ్రాత:**
(కాదు కాదు చెలియా ప్రాణేశుడు కాదు,
ఇదంతా చేసింది నల్లుల బారు సుమా!)

## ధన్యా కేయం స్థితా తే శిరసి?

**విశాఖదత్తుని ముద్రారాక్షసనాటకం**లోని
(నాటకాలు మొదలైన రూపకాలకు మొదట చేసే ప్రార్థనను
నాంది అంటారు)నాందీ శ్లోకం
**పార్వతీపరమేశ్వర సంవాదరూపం**(**సంభాషణచిత్రం**)
చూడండి

**ధన్యా కేయం స్థితా తే శిరసి? శశికలా, కిం నునా మైత దస్యా:**

**నామ్నై వాస్యాస్తదేతత్, పరిచిత మపి తే విస్మితం కస్య హేతో:?**
**నారీం పృచ్ఛామి నెన్దుం? కథయ తు విజయా, న ప్రమాణం యదీన్దు:**
**దేవ్యా: నిహ్నోతు మిచ్ఛో: - ఇతి సురసరితం శౌర్య మవ్యా ద్విభో ర్వ:**

శివుని జటాజూటంలో
విలీనమై ఉన్న గంగనుచూచి,
ఈర్ష్యపడిన పార్వతి శివునితో
ఈ విధంగా సంభాషణ ప్రారంభించింది.

పార్వతి - (పరమ ప్రేయసినైన నేను నీ(శంభుని) వామభాగంలో అర్థాంగిగా ఉండగా)
**ప్రభూ! నాభర్తవైన మీ(శివుని) ఉత్తమాంగమును**
**(శిరసును)అధిష్ఠించిన ధన్యురాలు ఎవరు?**
(అసూయతో ఎత్తిపొడుస్తూ ప్రశ్నించింది)
శివుడు - (తన నెత్తినున్న గంగను కప్పిపుచ్చాలనుకొని) **శశికలా** (చంద్రలేఖ)
(అని) **శశి**(స్త్రీలింగంతో, వ్యాజోక్తి ధ్వనింప చేస్తూ సమాధానమిచ్చాడు)
పా. - **అయితే ఈవిడ పేరేమిటి**?
శివుడు - **దాని పేరూ అదే. నీకు తెలుసుకదా!**
**ఎందుకు మరిచిపోయావు**?
(శివుని మోసాన్ని గుర్తించిన పార్వతి)
పా. - **నాథా! నేనడిగేది ఆ చంద్రరేఖను గురించికాదు.**
**మీ జటాజూటంలో ఉన్న ఆ అపరిచిత యువతిని గురించండీ!**
శివుడు - (నన్నడిగిన విజాతీయ "ఇన్దు" ప్రధానకర్మకమైన ప్రత్యుత్తరం)
**నీకు ప్రమాణంకాకపోతే**
**సజాతీయతననుసరించి,**
**నీకు విశ్వాసపాత్రురాలైన**
**నీ సఖి ఆ విజయనే అడుగు.**

ఈ విధంగా వాక్చాలంతో తన తలపై ఉన్న
గంగాదేవిని కప్పిపుచ్చటానికి
ప్రయత్నించిన ఆ పరమేశ్వరుని
ఛలోక్తి మనలను రక్షించుగాక! - అని కవిభావన.

## నాన్నా అమ్మ కోప్పడుతోంది!

ఇది **కుమారస్వామి**కి - **శివుని**కి మధ్య సంభాషణ చూడండి.

**అమ్బా కుప్యతి తాత! మూర్ధ్నివిధోతా గంగేయ ముత్సృజ్యతామ్**
**విద్వన్! షణ్ముఖ! కా గతి ర్మమ చిరం మూర్ధ్నిస్థితాయా: వద**
**కోపావేశవశా దశేషవదనై: ప్రత్యుత్తరం దత్తవాన్**
**అంబోధి, ర్జలధి: పయోధి, రుదధి: వారాంనిధి: వారిధి:**

**కుమారస్వామి** - నాన్నా! అమ్మ కోప్పడుతోంది. నీతలనెక్కి పెత్తనం చేస్తున్న
ఆగంగమ్మను వదిలించుకోరాదా!
**శివుడు** - ఒరే! ఆరుముఖాలుగల కుమారస్వామీ నన్నే నమ్మి,
ఇంతకాలంగా నాతలపై ఉన్న గంగమ్మను విడిచిన

ఇక దాని గతి ఏమౌతుందో, నీవు పండితుడవుగదా! కొంచెం ఆలోచించి చెప్పు?

(అనగానే కోపం వచ్చి ఆర్ముగం ఆరుముఖాలతో ఒక్కసారిగా)

కుమారస్వామి - అంబోధి, జలధి, పయోధి:, ఉదధి, వారాంనిధి:, వారిధి:

(అని ఈ ఆరుపదాలు సముద్రానికి పర్యాయపదాలు చెప్పాడు.

అంటే నదులకు భర్త సముద్రుడు ఉన్నాడు కదా

అక్కడికే వెళుతుందిలే కావున ఆమెను వదిలిపెట్టు అని అన్నాడు.)

## నాగరిక: కిం మిలిత:

సమానమైన విశేషణము ద్వారా వినేవారికి వేరొకటిగా అనిపింపజేసి
తర్వాత యదార్థ విషయాన్ని చెప్పడాన్ని అపహ్నుతి అంటారు.
అలాంటివి సంవాద చిత్రంలో చూడండి.

**సీత్కారం శిక్షయతి వ్రణయ త్యధరం తనోతి రోమాంచమ్**
**నాగరిక: కిం మిలిత: - నహి నహి సఖి హైమన: పవన:**

ఒక నాయిక తన సఖితో చెబుతున్నది. నాయికా- సఖి సంభాషణ-

నాయిక - **సీత్కారం శిక్షయతి**

సీత్కారం కలిగించును

**అధరం వ్రణయతి**

క్రింది పెదవిని గాయపరచును.

(భ్రమపడిన)

సఖి - **కిం నాగరిక: మిలిత:?**

ఎవడైన విలాస పురుషుడు లభించెనా?

నాయిక - **నహి! నహి! హైమన: పవన:**

కాదు! కాదు! చలిగాలి సుమా!

తనకు సీత్కారం, అధర వ్రణం నాయకునివలన కలిగినదని
తన మాటలవలన భ్రమపడిన సఖికి
యదార్థము చెప్పి భ్రమను నివారించింది.
సీత్కారము పెదవిగాయము నాయకునివలన కలిగినట్లు
చలిగాలివలన కూడ పెదవులు గాయంకావడం బాధ పడటం సహజమేకదా!

(సీత్కారము = చలి మొదలయిన వాటివలన బాధచే కలిగే ధ్వని విశేషము.)

## హృదయమపి తే చండి కఠినమ్!

బాణభట్టు, మయూరభట్టు ఇద్దరు బంధువులని ప్రతీతి.
బాణునికి మయూరకవి బావమరిది.
ఒకరోజు మయూరుడు తన ఇంటికి ఆలస్యంగా వెళ్ళడంతో
ఆయన భార్య కోపించి తలుపు తీయకుండా బయటే నిలబెట్టిందట.
రాత్రంతా బయట పడిగాడ్పులు కాచిన మయూరుడు

తెల్లవారు జామున తలుపు తీయమని భార్యను
బ్రతిమాలుతూ........
ఈ శ్లోకం చెప్పడం మొదలు పెట్టాడు.

**గతప్రాయా రాత్రి: కృశమపి శశి శీర్యత ఇవ**
**ప్రదీపోఽయం నిద్రావశముపగత: ఘూర్ణత ఇవ**
**ప్రణామాంతో మానస్తదపి న జహాసి కృధమహో...**

(రాత్రి దాదాపు గడిచి పోయింది,
చంద్రుడు కూడా తేజస్సు కోల్పోయాడు.
దీపం కూడా నిద్రపోతున్న మనిషిలాగా తూగుతూంది.
ఎంత వేడుకున్నా నీ కోపం వీడకున్నావు.............)

అప్పుడే ఆ దారిన పోతున్న
బాణభట్టు ఈ క్రింది విధంగా పూరించాడు.

**కుచ - ప్రత్యాసత్యా హృదయమపి తే చండి కఠినమ్**
(ఓ చండికా! నీ (కఠిన) ఉరోజాలకు అతి సమీపంలో ఉండటం

వల్లనే నేమో నీ హృదయం కూడా ఇంత కఠినంగా ఉంది.)

## ఏమి ప్రయోజనము?

రాధ కృష్ణుని వెదకుచున్నది
బృందావనంలో
సఖితోటి.
వారి ఇరువురి సంభాషణ
ఈ శ్లోకం చూడండి.

**కుందకుంజ మముం పశ్య సరసీరుహలోచనే**
**అమునా కుందకుంజేన సఖి! కిం ప్రయోజనమ్?**

సఖి - **కుందకుంజ మముం పశ్య సరసీరుహలోచనే**
ఓ సరసీరుహలోచనా! రాధా! ఈ మొల్ల పొదను చూడు!

రాధ - **అమునా కుందకుంజేన సఖి! కిం ప్రయోజనమ్?**
చెలీ! మొల్ల పొదను చూచినందువల్ల లాభమేమి?

ఈ శ్లోకంలో **అమునా** అనే పదం చమత్కారంగా ప్రయోగించారు.
అమునా అంటే **ము** - కారము లేని
కుందకుంజములతో అనగా
ముకుందుడు(కృష్ణుడు) లేని
పొదరింటితో లాభమేమి అని తాత్పర్యం.

# ఎవరిలోకం వారిదే!

ఒకడు తన గాడిదను కంబళిని పోగొట్టుకొని అడవిలో వెతుకుతున్నాడు.
ఆ వనంలో ఒక వనచరుడు తన నగ్నమైన ప్రియురాని అంగము చూస్తూ ఆనందం ప్రటిస్తున్నాడు.
ప్రియురాలు - వనచరుడు- గాడిద పోయినవాడు -
వీరి మధ్య సంభాణ ఈ శ్లోకం చూడండి.

**కింకిం పశ్యసి? - తే యోనౌ త్రైలోక్యమిహ తిష్ఠతి!**
**పశ్యపశ్య విశాలాక్ష! గర్ధభం మమ కంబళమ్**

ప్రియురాలు - **కింకిం పశ్యసి?**
ఏమిటి పరిశీలనగా చూచుచున్నావు?
ప్రియుడు - **తే యోనౌ త్రైలోక్యమిహ తిష్ఠతి!**
నీ యోనిలో ముల్లోకములూ కనిపిస్తున్నాయి.
గాడిదపోయినవాడు - **పశ్య పశ్య విశాలాక్ష! గర్ధభం మమ కంబళమ్**
ఓ విశాలనేత్రుడా! చూడుచూడు......
నా గాడిద, కంబళి ఉన్నాయేమో చూడు.

# వీపున దూసెనటంచు చూచితిన్

కూచిమంచి తిమ్మకవి **రసికజనమనోరంజనము** చదివి
ఒక వేశ్య ఆయనను అమితంగా అభిమానించినది.
ఆయన ఒకానొక రోజు ఆ వీధి వెంట వెళుతూండగా గమనించిన ఆమె
ఆయనను అమాంతముగా కౌగిలించుకొన్నది.
ఆయనా పరమ నైష్ఠికుడాయె వెంటనే ముఖాన్ని వెనక్కు త్రిప్పుకున్నాడట.
అంతలో ఆమె ఈ విధంగా అడిగిందట.

**చతురులలోన నీవు కడు జావటంచును నెంచి కౌగిలిం**
**చితి నిటు మారుమోమిడగ చెల్లునె యో రసికాగ్రగణ్య**

దానికి **తిమ్మకవిగారు**
ఈ విధంగా ప్రత్యుత్తరమిచ్చారట.

**అ**
**ద్భుతమగునట్టి బంగరపు బొంగరపుంగవబోలు నీ కుచ**
**ద్వితయము ఔమ్మునాటి అల వీపున దూసెనటంచు చూచితిన్**

# పాపరాజుకు సంగమప్రాప్తిరస్తు!

ఇది కంకంటి పాపరాజు(ఉత్తర రామాయణకర్త) పద్యంగా ప్రసిద్ధం.
పాపరాజుకు వేశ్య కు మధ్య జరిగిన సంభాషణ
ఈ పద్యం చూడండి.

పాపరాజు - **ఒంటిమిట్టను కాపురంబున్నయట్టి**
**సిద్ధసానికి సంకల్ప సిద్ధిరస్తు**
వేశ్య - **చెలగి నామీద పద్యంబు చెప్పినట్టి**
**పాపరాజుకు సంగమప్రాప్తిరస్తు**

## సుతు వాహన వైరి వైరి సున్నం బిదిగో!

**పర్వత శ్రేష్ఠపుత్రికా పతి విరోధి**
**అన్న పెండ్లాము అత్తను గన్న తండ్రి,**
**ప్రేమ వారింట పెరిగిన పెద్దబిడ్డ**
**సున్నమిప్పుడు తేగదే సుందరాంగి!**
అని సున్నం అడిగాడు కదా!
దానికి ఆమె మాత్రం తక్కువ తిన్నదా!
ఆమె ఈ పద్యం చెప్పి సున్నం ఇచ్చిదట.
చూడండి ఆ పద్యం..........

**శత పత్రంబుల మిత్రుని**
**సుతు జంపిన వాని బావ సూనుని మామన్**
**సతతము దాల్చెడు నాతని**
**సుతు వాహన వైరివైరి సున్నం బిదిగో!**

శతపత్రంబుల మిత్రుడు - తామరలకు ఆప్తుడు - సూర్యుడు,
సూర్యుని సుతుడు- కర్ణుడు,
కర్ణుని జంపినవాడు - అర్జునుడు,
అర్జునుని బావ - కృష్ణుడు,
కృష్ణుని సూనుడు - మన్మథుడు,
మ్నమథుని మామన్ - చందమామ,
చందమామను సతతము దాల్చువాడు - శివుడు,
శివుని సుతుడు - వినాయకుడు,
వినాయకుని వాహనము - ఎలుక,
ఎలుక వైరి - పిల్లి,
పిల్లి వైరి - కుక్క,
ఓ కుక్కా సున్నం ఇదుగో అని అన్నది ఆమె.
దరిద్రపు పెద్దమ్మా సున్నమేదీ? - అంటే
కుక్కా ఇదుగో! సున్నం - అంది ఆమె

సరిపోయిందా! మాటకుమాట.
ఎంత చమత్కారం.

## నెలఁత తన విభుఁడునుఁదాను నెత్తమాడె

**పింగళి సూరన కళాపూర్ణోదయము** లోని
ఈ **సంభాషణ చిత్రం** చూడండి.
**రంభ** - **నలకూబరుడు** విమానంలో వెడుతూ
పాచికలాడుతూ పరస్పర సరససంభాషణము
చేసుకొనే పద్యం ఇది.
చూడండి.

**నిలు మహో బొంకకు నెత్తకమ్మటంచుఁ**
**బక్షులులెక్కెడు నొయ్యఁబలుకు మనుచుఁ**
**జిక్కె నీ సారె నా చేనంచుఁజిక్కె నౌ**
**దీనిపాలిటి కూడు దిన్న ననుచు**
**నదె దుగ తివకుమీ సుదతి నీవంచు నౌ**
**నిదె సారె దాఁకె నీ యిచ్చ యంచు**
**నినుమాటు దంచిన నెసటి పోఁత లటంచు**
**నౌనట్ల యుడికె(దు)డుఁగాని యంచు**
**నిట్టి దంటమాటలు నేర్చి తెచట ననుచు**
**దంట నేనౌట నీ సంగతమున నంచుఁ**
**(దమ పరస్పర సరస వాక్యములుఁదనర**
**నెలత తన విభుఁడునుఁదాను నెత్తమాడె)**
(కళాపూర్ణోదయము -6-120)

నలకూబరుడు - **నిలు మహో బొంకకు నెత్తకమ్మటంచుఁ**
ఆగు ఆగు(నిలుము) అహో! పెట్టిన పందెంగురించి
(నెత్తకమ్ము) అబద్ధం ఆడకు.
(మధుపాన చుంబనాలింనాలే వారి పందేలు)

రంభ - **బక్షులులెక్కెడు నొయ్యఁబలుకు మనుచుఁ**
పక్షులు భయపడతాయి(ఉలెక్కెడున్),
కాసింత నెమ్మదిగా మాటాడవయ్యా బాబూ!
(విమానంలో పోతున్నారు కదా చుట్టు పక్కల ఎగిరే పిట్టలు
జడుసుకుంటాయని పైకి
తమతో విమానంలో ఉన్న నలుగురు వనితలకు
తమ సంగతి తెలిపోతుందని ఆంతరము.)

నలకూబరుడు- **జిక్కె నీ సారె నా చేనంచుఁజిక్కె నౌ**
రంభా! ఇదిగో నీ పాచిక(సారె) నా చేతికి చిక్కింది
(సారె అంటే పాచిక, గోరింక - నీ పెంపుడు గోరింక
(నువ్వు పందేం పెట్టినది) నా చేతికి చిక్కింది అనడం - పైకి.
సారె అంటే పాచిక ఆకారంలో ఉండే స్తనాగ్రం.
అది నా చేతికి చిక్కింది అని ఆంతరం.)

రంభ - **దీనిపాలిటి కూడు దిన్న ననుచు**
అవునా! నా పాచిక నీ చేతికి చిక్కింది, దీని పాలిటి పణం అంతా
నువ్వు తినేశావు - గెలుచుకున్నావుగదా మరి.

నలకూబరుడు - **నదె దుగ తివకుమీ సుదతి నీవంచు నౌ**
అందమైన పలువరుసగలదానా!(సుదతి)
ఇదిగో! నాకు పాచికల్లో రెండు(దుగ) పడింది.
దీన్ని తోసెయ్యకు (తివకుము)సుమా(స్తనద్వయం రెండూ
దొరికాయి నెట్టెయ్యకు అని ఆంతరం.)

రంభ - **నిదె సారె దాఁకె నీ యిచ్చ యంచు**

అవును! నీకు రెండు(దుగ)పడింది నిజమే
కానీ ఇదిగో సారె తాకింది(అంటే అతడి గవ్వ ఉన్న గడిలోకి ఈమె
గవ్వ చేరి దానిని చంపడం) మరి నీ ఇష్టం ఏం చేస్తావో!
(నా స్తనద్వయాన్ని సారె సారెకూ (మాటిమాటికి) తాకుతున్నావుగదా!
నీ ఇచ్ఛ - తీర్చుకో - అని ఆంతరము)

నలకూబరుడు - **నినుమాటు దంచిన నెసటి పోఁత లటంచు**
ఇలా రెండుసార్లు(ఇనుమాటు) నాగవ్వ చంపేస్తే(దంచినన్)ఎలా?
ఇవ్వేక్కడి సారెపోతలు ఇలా ఎసరులు పెట్టడాలైతే (ఎసటి - పోతలు)
ఇంక నీతో ఆడేదెలా? గెలిచేదెలా?(ఇనుమాటు దంచడంలోని ఆంతర్యం ఊహించండి)

రంభ - **నౌనట్ల యుడికె(దు)డుఁగాని యంచు**
అవును! అలాగే ఉడుక్కుందువుగానిలే
(దంచిన బియ్యం ఎసట్లో పొయ్యండం ఉడికించుకోవడం - ఇది ఆంతర్యం)

నలకూబరుడు- **నిట్టి దంటమాటలు నేర్చి తెచట ననుచు**
రంభా! ఇలాంటి గడసరిమాటలు(దంటమాటలు) ఎక్కడ నేర్చావు?

రంభ - **దంట నేనౌట నీ సంగతమున నంచుఁ**
నేను గడసరిగా మారింది (దంటనౌట) నీ సాంత్యంవల్లనే
(సంగతి- సంగతము - అనే పదాలకు స్నేహం, సంభోగం,
కలయిక అనే అర్థాలున్నాయి.)

# నీ కుల్కుఁ జెండ్లేవి పైకమ్ముఁ దప్పించు

మన సాహిత్యంలో పుష్పలావికలతోటి మాటలు
బహుచమత్కారంగా ఉంటాయి.
అలాంటిది ఒక సన్నివేశం........

**నెత్తమ్ముఁ జూచెద నీ వింత వదిలించు**
**నీవింత వదలక నే విధంబు?**
**నీ కుల్కుఁ జెండ్లేవి పైకమ్ముఁ దప్పించు**
**పైకమ్ము దప్పనే చేకొనంగ?**
**నెంత నీ కైదండ నిచ్చెదవఁటె మేలు**
**కైదండ యిత్తురే కర మెడలక?**
**భావింప రుచి యేమొ బంధుజీవం బేది?**
**యీ బంధు జీవనం బెందుఁగలుగు?**
**(ననుచు వీథుల సరసనర్మానుకూల**
**వచన రచనల మెలఁగుచు వఱలు విటుల**
**కనుగుణంబుగఁ బలుకుచు ననుదినంబు**
**వెలయుదురు వీటఁ బుష్పలావికలు ప్రీతి)**
(బిల్హణీయము -1-39)

విటుల - పుష్పలావికల(పూలు అమ్మేస్త్రీలు) సంభాషణ

విటుడు- **నెత్తమ్ముఁ జూచెద నీ వింత వదిలించు**
(అమ్మీ! ఏది నీదగ్గర చాలా అందమైన తామరపువ్వు,

బాగా వికసించిన తమ్మిపువ్వు ఉందట గదా! చూస్తాను,
కుదిరితే కొంటాను. నువ్వు కాసింత (ఈవు+ ఇంత)వదిలించు.
దానిమీద కప్పిన తడిపావడా తొలగించు. నీ తమ్మిపువ్వు గురించి
అందరూ చెప్పుకుంటున్నారు. ఒక్కసారి చూపించేసి ఈ వింత కాసింతా
వదిలించు (ఈ+వింతన్ - వదలించు)(నెత్తమ్మి అనేది నాభికి సంకేతం))

పుష్పలావిక - **నీవింత వదలక నే విధంబు?**
(అబ్బే! నువ్వు ఏదో ఇంత సొమ్ము వదలకుండానే?
(నీవు + ఇంత - వదలకన్) నీ కోరిక ఏ విధంగా తీరుతుంది?
నా నెత్తమ్మి కొనడానికే కాదు చూడటానికి కూడ ఒక వెల ఉంది
(నీవు - ఇంత -వదలకన్, పోకముడి కాసింత వదిలించకుండా
నాభి సందర్శన ఏ విధంగా కుదురుతుంది))

విటుడు- **నీ కుల్కుఁ జెండ్లేవి పైకమ్ముఁ దప్పించు**
(అమ్మీ! ఏవీ నీ పూలచెండ్లు కులుకులొలికే పూలచెండ్లు. ఎక్కడ దాచావో?
ఎవరికీ కనిపించకుండా వాటిపైని నువ్వు కప్పిన ముసుగును (పై - కమ్ము)
తొలగిద్దూ(చెండ్లు స్తనాలకు సంకేతం))

పుష్ప- **పైకమ్ము దప్పునే చేకొనంగ?**
(అలాగే. వీటిని నువ్వు కొనాలన్నా చేకొనాలన్నా (చేతులతో పట్టుకోవడం)
పైకమ్ము(ధనం) చెల్లించక తప్పుతుందా ?(తప్పునే))

విటుడు - **నెంత నీ కైదండ నిచ్చెదవఁటె మేలు**
(ఎంత నీ కైదండ(చేతిలో ఉన్న దండ- బారెడు దండ, కౌగిలి)
అమ్ముతావా?
అసలు (ఇచ్చెదవఁటె))

పుష్ప.- **కైదండ యిత్తురే కర మెడలక?**
(నువ్వు చెయ్యి చాపకుండానే? (కరము - ఎడలక) కైదండ ఇస్తారా?
ఎలా నాయనా! (తగినంత పన్ను - రొక్కం (కరము) చెల్లించకుండానే
కైదండ ఇస్తారా)

విటుడు- **భావింప రుచి యేమొ బంధుజీవం బేది?**
(అమ్మీ! ఆలోచించగా ఆలోచించగా నాకు ఇష్టమేనేమో? (రుచి+ఏమొ)
ఈ మంకెనపువ్వు (బంధుజీవంబు)(నీకు బంధువుగా జీవించడం ఒక రుచి
ఏమో?
భావిచడానికే రుచిగా ఉంది సుమీ!)

పుష్ప.- **యీ బంధు జీవనం బెందుఁగలుగు?**
(అవును. ఇదిగో ఇది మంకెన పువ్వే. నా దగ్గరరున్న ఈ మంకెనపువ్వు
(బంధుజీవనంబు) ఏదీ మరింకెక్కడ దొరుకుతుంది చెప్పు ఏది - ఎందున్ -
కలుగు
(నాతో ప్రియ బంధువుగా జీవనం, ఆ రుచి ఇంకెక్కడా దొరకదు నీకు)
(మంకెన కూడా అవయానికి సంకేతమే)

# నా దండకును వెలఁబెట్ట నెవ్వని తరంబు?

పుష్పలావికలు(పువ్వులు అమ్మే యువతులు)
మాట్లాడేతీరు
ఇంతకు మునుపు చూచి ఉన్నాము.
ఇపుడు **ఆముక్తమాల్యద**లో
**పుష్పలావికల**ను గురించిన
పద్యాన్ని చూద్దాం.

**వెలఁది! యీ నీదండ వెల యెంత? నాదండకును వెలఁబెట్ట నెవ్వని తరంబు
కలువ తావులు గాన మలికదంబకవేణి! కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నాకిమ్మ పడఁతి! యీ గేదంగి నన కడివోమి ముందటికిఁ జూడు
జాతు లే వంబుజేక్షణ! పద్మినులుసైతమును నున్న యెడ జాతులునికి
యరుదె?
(యనుచుఁ దొలినుడి నభిలాష లెనయ మూఁగి
పలుకుతోడనె నర్మగర్భంబుగాఁగ
నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు
లమ్మెదురు పుష్పలావికలప్పురమున)**

(ఆముక్తమాల్యద - 2-12)

విటుడు - **వెలఁది! యీ నీదండ వెల యెంత?**
ఓ యువతీ(వెలఁది) ఇదిగో నీదండ వెల ఎంత
(దండ అంటే పూలదండ పైకి కనిపించే అర్థం, కౌగిలి(కైదండ),
సామీప్యం అని లోని ఆంతర్యం.)

పుష్పలావిక - **నాదండకును వెలఁబెట్ట నెవ్వని తరంబు?**
నా దండకు వెల చెప్పడం(వెలగట్టడం) ఎవడి తరం నాయనా?
విటుడు - **కలువ తావులు గాన మలికదంబకవేణి!**
తుమ్మెదల గుంపు వంటి జడదానా(అళి - కదంబక - వేణి) సరే ఇంతకీ
కలువ(ల)
తావులు(పరిమళాలు) కనిపించలేదు నీ అంగడిలో
(అన్ని పూలున్నాయిగాని కలువలు కనిపించటంలేదే - అని పైకి.
నాయిక నాభిని - కలువపూలతో, నీటి సుడులతో కవులు పోలుస్తారు.
అంటే విటుడు నాయిక నాభిని కనిపించడం లేదనేగా అడుతున్నది.)

పుష్పలావిక- **కలువతావులు వాడకయ కలుగునె?**
ఎక్కడన్నా కలువలకు పరిమళాలు వాడిపోకుండా గుప్పుమంటాయా?
(కలువలు, పొన్నలు, మొగలిపూలు వాడే కొలది వాసన వస్తాయి.
ఇవి తాజావని సమాధానం పైకి.
నాభి వగైరా ప్రదేశాలు వాడకముందే (ఉపయోగించకముందే)
కనిపిస్తాయా? అన్నది లోని సమాధానం)

విటుడు - **కడివోదు నాకిమ్మ పడఁతి!**
పడతీ! ఇదుగో ఈ మొగలిపువ్వు నలిగినట్టే లేదే?
(తాజా పువ్వును చూపిస్తూ) నాకు ఇయ్యి?
(కడిపోదు - నలిగిపోదు)

పుష్పలావిక - **యీ గేదంగి నన కడివోమి ముందటికిఁ జూడు**
అవునవును. ఈ పువ్వు నలగకపోవడం వడలిపోవడం -
ఇదంతా ముందుముందు తెలుస్తుందిలే - ముందరిక చూడు
(కడి అంటే అన్నపు ముద్ద, విరహం తట్టుకోలేక
(కడి + పోమి) ఇదంతా నీకు ముందు ముందు తెలుస్తుంది
- అనేది అంతర్యం)

విటుడు - **జాతు లే వంబుజేక్షణ!**
పద్మాల్లాంటి కన్నులుగలదానా!(అంబుజేక్షణ)

నీ అంగడిలో జాజులు (జాతి - జాజి) ఏవి కనిపించవేమిటి?
(జాతి అంటే నీవు ఏజాతికి చెందిన దానివి పద్మిని,
శంఖిని, హస్తిని మొదలైన జాతులలో)

పుష్పలావిక - **పద్మినులుసైతమును నున్న యెడ జాతులునికి యరుదె?**
పద్మినులు కూడా ఉన్న అంగడిలో
జాజులుండడం(ఉనికి) అరుదా?
(పద్మనీ జాతి వేశ్యలే ఉన్నచోట మిగతా జాతులవారు ఉండరా!
అది అంత అరుదా? అని లోని ఆంతర్యం)

## ఏమే యెక్కడ నున్నదాన? విట రావే!

మాయలేడిని చంపి తిరిగి వచ్చిన తరువాత
**రామ** - **లక్ష్మణు**లకు జరిగిన సంభాషణ
**భాస్కరరామాయణం**లోని
ఈ పద్యంలో చూడండి.

**ఏమెట్టీయది? మెట్టుగా దిది వనం బేరాకుమారుండనో**
**సౌమిత్రీ! విను నీవు రాముఁడవె, వత్సా! నిక్క మే రాముండన్**
**భూమీశుండవు రామచంద్రుఁడవు - హా! భూమీజ! చంద్రాననా!**
**యేమే యెక్కడ నున్నదాన విట రావే యుల్ల మల్లాడెడిన్!**

(భాస్కరరామాయణము అరణ్య. - 260)

రాముడు - **లక్ష్మణా! ఇది ఏ ఆశ్రయమయ్యా చెప్పు.**
లక్ష్మణుడు - **ఇది ఆశ్రయం కాదు అడవి సుమా!**
రాముడు - **అయితే - సౌమిత్రీ! నేను రాచకొడుకునేనా?**
లక్ష్మణుడు - **అవును - విను - నీవు రాముడవే.**
రాముడు - **నాయనా! నేను నిజంగా రాముడనేనా? చెప్పు**
లక్ష్మణుడు - **నీవు కోసల భూమీశుడవు, రామచంద్రుడవయ్యా.**
(భూమీశుడవులో భూమి, రామచంద్రుడులో చంద్రుడు వినగానే-
భూమిపుత్రి - చంద్రుని వంటి ముఖముగలది సీత గుర్తుకు వచ్చింది.)
రాముడు - **హా! భూమిపుత్రీ! చంద్రాననా! ఏమే సీతా! ఎక్కడున్నావు?**
**నామనస్సు ఆందోళన చెందుతూంది ఇక్కడకు రావే!** (అని
పరితపించాడు.)

## మేలా! యీసంరంభము

**మేడేపల్లి వేంకటరమణాచార్యులు**గారి **దేవవ్రతచరిత్ర**లో
మూడవ ఆశ్వాసంలో కొన్ని పద్యాలు సంభాషణ చిత్రంలో
వ్రాయబడ్డాయి. వాటిలో ఒకటి

దేవవ్రతుడు అంటే భీష్ముడు - అంబను వివాహమాడమని
పరశురాముడు కోరగా దానికి నిరాకరించడంతో
వారిద్దరి మధ్య యుద్ధం అనివార్యమైంది.
ఆ సందర్భంలోనిది ఈ పద్యం
భీష్మ పరశురాముల సంభాషణ ఇది.
కందపద్యంలో వ్రాయబడింది.

భీష్ముడు - **మేలా! యీసంరంభము**
**హేలా సంతర్జితావనీశ్వర! నీకున్**
జామదగ్న్య(పరశురాముడు)-
**బాలామణిగైకొనుమీ**
భీ. - **వాలాయము సేయనౌనె? భార్గవ చెప్పుమా!**

# లఘిష్ఠేదం షష్ఠాక్షరపరవిలోపాత్పఠ పున:

చిత్రమీమాంసలోని ఈ శ్లోకం చూడండి.
ఇది చ్యుతాక్షర చిత్రానికి ఉదాహరణగా ఇవ్వబడినది.

**భవిత్రీ రమ్భోరు త్రిదశవదనగ్లానిరధునా**
**స మే రామ: స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖ:**
**ఇయం యాస్యత్యుచ్చైర్విపదమధునా వానరచమూ:**
**లఘిష్ఠేదం షష్ఠాక్షరపరవిలోపాత్పఠ పున:**

ఇందులో సీతా రావణ సంవాదం ఉంది.

రావణుడు - **భవిత్రీ రమ్భోరు త్రిదశవదనగ్లానిరధునా**
**స మే రామ: స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖ:**
**ఇయం యాస్యత్యుచ్చైర్విపదమధునా వానరచమూ:**
(అరటిస్తంభాల వంటి ఊరువులు గల
ఓ సీతా! ఇపుడు దేవతల ముఖాలు వాడిపోతాయి.
లక్ష్మణసహితుడైన ఆ రాముడు యుద్ధంలో నా ఎదుట నిలబడలేడు.
ఇప్పుడీ వానరసేన గొప్ప ఆపద పొందగలదు.)
సీత - **లఘిష్ఠేదం షష్ఠాక్షరపరవిలోపాత్పఠ పున:**
(ఓ నీచుడా దీనినే ఏడవ అక్షరం తొలగించి మళ్ళీ చదువు)
మూడు పాదాలలోని ఏడవ అక్షరాలు తీసివేయగా

మొదటి పాదం (**భవిత్రీ రమ్భోరు త్రిదశవదనగ్లానిరధునా**)లో -
**దశవదనగ్లాని:**(రావణుని లేదా పది ముఖాల గ్లాని
(శ్రమముచేత కలిగిన దౌర్బల్యము))
రెండవ పాదం (**స మే రామ: స్థాతా న యుధి పురతో లక్ష్మణసఖ:**)లో -
**రామ: స్థాతా యుధి**(రాముడు యుద్ధంలో నిలబడతాడు)
మూడవ పాదం(**ఇయం యాస్యత్యుచ్చైర్విపదమధునా వానరచమూ:**)లో
- **ఉచ్చై: పదమ్** (ఉన్నతస్థితిని)
అనే అర్థాలున్న పదాలు ఏర్పడ్డాయి.

దీనిలో రావణుడు అనుకున్న వాటికి విరుద్ధంగా వచ్చాయి.

